





# శతకాలు

భక్తి,జ్ఞాన,నీతి

# మనసోద్బోధక శతకము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీమదుమారమణాయ నమః.

# మానసోద్బోధక శతకము.






సత్యవోలు సుబ్బారావు,



పీఠికాపురము.

1938

శ్రీ మదుమారణాయ నమః

# మానసోద్బోధకశతకము



శ్రీకారుణ్యపయోధరా! సుగుణమూర్తీ! దైవచింతామణీ!
శ్రీకైలాసగిరీంద్రవాస! వరదా! శ్రీశంకరా! దేవరా!
శ్రీకంఠా! హరిసేవితాంఘ్రియుగళా! క్షేమంకరా! యీశ్వరా!
నీకున్మ్రొక్కుచుఁ గావుమంచు మనసా! నిత్యున్ హరున్వేఁడవే.

మ పరమాత్మా! నిజభక్తలోకజనకా! స్వామీ! శివా! శంకరా!
గిరిజాలోల! సురార్చితాంఘ్రియుగళా! కేదారవాసా! మహే
శ్వర! శంభూ! దురితాపహార! హర! యీశా! లోకసంరక్షకా!
శరణం బీవె యటంచు వాని మనసా శాంతంబుగాఁ గొల్వవే.

మ. శరణోశంకర! భక్తవత్సల! దయాసాంద్రా! విశేషాధిపా!
కరుణం బ్రోవవె నీకు దాసుఁడ నమస్కారంబులం జేయుదున్
ధరలో నీకెనవచ్చు దైవము జగద్బంధూ! తలంపంగ నా
కొరు లెవ్వారును లే రటంచు మనసా యుగ్రాక్షునిం గొల్వవే.

శా. పాపాత్ముండను దుష్టచిత్తుఁడను నాపాపంబులం బాపి వే
చేపట్టంగవవే దయాశరధి! యోచంద్రరూప! సర్వేశ్వరా!
నీపాదంబులె దిక్కు నా కనుచు నానిత్యున్ హరున్ భక్తి నీ
చాపల్యం బొకకొంతవీడి మనసా సంతుష్టితోఁ గొల్వవే. 4

మ. హరునిన్ శంకరునిన్ దయానిరతునిన్ యక్షేశ్వరాధీశ్వరున్
గరుణారూపుని రాజశేఖరుని శ్రీగంగాజటాజూటు నీ
శ్వరునిం గిన్నరనాధమిత్త్రు నభవున్ శంభున్ విరూపాక్షునిన్
గిరిజాధీశ్వరు భక్తి గల్గి మనసా కీర్తింపవే నిత్యమున్. 5

మ. జగదాధార ! పురాణపూరుష ! జగత్స్వామీ ! దయాంభోనిధీ!
నిగమస్తుత్య ! సురాధినాథ ! యధిపా ! నిర్హేతుసంరక్షకా !
మృగముం బోలిన మూఢచిత్తుఁడను నామీఁదం దయంజూపవే
సుగతిం బొందఁగఁజేయుమంచు మనసా క్షోణీరథుం గొల్వవే.

శా. ఫాలాక్షుండు గృపాసముద్రుఁడు జగద్బంధుండు సర్వాత్ముఁడున్
మూలాధారుఁడు లోకపావనుఁడు సంపూజ్యుండు లోకేశుఁడున్
శ్రీలక్ష్మీపతిసేవితాంఘ్రుఁడు మహాశ్రీయుండు చాలన్ దయా
శీలుం డాతనిఁ గోరి కొల్చి మనసా శ్రేయంబులం బొందవే. 7

మ. నిరతంబున్ శివ! శంకరా! హరహరా! నిత్యా!మహాదేవ! యో
వరదా ! యీశ్వర! లోకరక్షణచణా ! భక్తానుమోదా! సురే
శ్వర! మృత్యుంజయ!కాలకూటధరణా!భర్గా!యటంచున్ శివున్
స్మరణం జేయుము భక్తితోడ మనసా!మన్నించు నీపాపముల్

శా. భావాతీతుఁడవైన నీపదములన్ భావించి పూజింపఁగా
దేవేంద్రాదిసురార్చితా ! భవహరా ! దీనుండ నే నేర్తునే
నా పాపాపములన్ హరించి దయతో స న్నేల నీకన్న నో
దేవా ! వేరని శంభుఁగూర్చి మనసా తీపారఁ బ్రార్థింపవే. 9

శా. అంతా వద్దు మహాత్మ ! నాయెడలఁ జింతాకంతయే నీ దయం
బంతం బెన్నక చూపుదేని యదియే భాగ్యంబుగా నెంచి నే
సంతోషంబున నీదు నామమహిమన్ సాటింతు దప్పేని నా
కంతే చాలు నొసంగుమంచు మనసా యర్థింపవే భర్గునిన్. 10

శా. ఆయుర్భాగ్యము లాదిగాఁ గల సమస్తైశ్వర్యముల్ గల్గు ని
న్నే యాపత్తును బొందనీఁ డతఁడు సుధ్యేయుండు భక్తాళికిన్
శ్రేయోదాయకుఁ డార్తరక్షకుఁడు సంసిద్ధుం డుమానాథుఁ డా
ప్యాయం బెంతయుఁ జూపి కాచు మనసా వానిం బ్రశంసింపవే.

మ. మహిలో దైవసమానమైన నరజన్మం బెత్తి సంసార మన్
గహనాంతంబును బొంది తప్పుకొనుమార్గంబుం గనంగోర కీ
విహసౌఖ్యంబుల కాస బొందెద వదేమే? నశ్వరంబుల్ సుమీ!
కుహనత్వం బిఁక నైన వీడి మనసా కూటేశ్వరుం గొల్వవే.

మ. శతవర్షంబులు మాత్రమైన ధర విస్పష్టంబుగా నుండువే
యతిమిత్త్రుల్గద భార్యయున్ సుతులు వా రాప్యాయతం జేసి దు
ర్గతిసంప్రాప్తము గాఁగ నిన్నపుడు సంరక్షింపఁగా వత్తురే?
గతి యాశంభుఁడె వానిఁ గోరి మనసా! కాంక్షించి సేవింపవే.

శా. కాలం బంతయు నోటికుండజలముంగా వేగమే మాయమౌ
గాలుం డడ్డము సొచ్చి పట్టుకొని నీకంఠంబు బంధించు; నీ
వాలస్యం బొనరింపఁబోక యిపుడే యాపన్నసంరక్షకా!
జాలిం జూపుము దేవ!యంచు మనసా శంభున్ మదిం గొల్వవే

శా. మేడ ల్మిద్దెలు మాన్యము ల్గలవునే మేధావి నా కెవ్వఁడే
కీడుం జేయఁగ లేఁడు ధారిణిపయిన్ గీ డెప్పుడున్ రాదు నే
నాడిందే యగు నాటః పాడినదియే యౌఁ బాట యంచెంచుచున్
పాడై పోకువె గర్వ మూని మనసా భర్గున్ బ్రశంసింపవే. 14

శా. కాంత ల్పుత్త్రులు దేహముం ధనము నిక్కంబంచు యోజించి ర
వ్వంతైన న్భవు నీశ్వరుం గొలువఁగా యత్నింపకున్నావు నీ
వంతం బందున బాధ నొందెద, వి దంతా మిథ్యయే సుమ్మి నీ
కెంతో శ్రేయము కల్గుఁ జుమ్ము, మనసా యీశాను సేవింపవే.

శా. చుట్టంబుల్ దలపోయదొంగలుసుమీ సూనుల్ ఋణస్థుల్ సుమీ!
కట్టా ! వారలకై నిరంతరము నిక్కంబైన సన్మార్గమున్
ఇట్టే వీడి యగమ్యమార్గమునకే యిచ్చించి పోనుంటి; వి
క్కట్టుల్ పొందఁగనేల ? వెట్టిమనసా గౌరీపతిం గొల్వవే. 17

శా. న్యాయాన్యాయవిచక్షణన్ విడిచి దుర్వ్యాపారతన్ సాధులన్
మాయ న్ముంచి తదర్థము ల్గొనుటయే మర్మంబుగా నెంచి నీ
వాయాసమ్మును బొందఁగోరు దదియేలా? శర్వునిన్ భక్తితోన్
డాయంగోరి భజింప నీకు మనసా నానార్థముల్ గల్గవే ? 19

మ. అమితాశావశమై ధనార్జనము నన్యాయంబుగాఁ జేయు చ
క్రమముల్ సేయుచు నెప్పుడు న్భవుని సంప్రార్థింప లో నెంచవా
శమనుం డేయకమానునే యపుడు నీసంసార మింతైన నా
శ్రమః మాన్పంగను జాలునేమొ? మనసా రాజాంకునింగొల్వవే.

మ. కరుణామూర్తి భుజంగభూషణుని శ్రీ గౌరీపతిన్ శంభునిన్
స్థిరభక్తి న్నిముసంబుఁగూడ మదిలోఁ జింతింప కెల్లప్పుడుం
బరవిత్తంబుల బెల్లముంబలెఁ గడున్ భక్షించి యంతంబునన్
నరకంబందునఁ గూలిపోయి మనసా నైరాశ్యముం బొందకే.

శా. మే లేమాత్రము చేయఁబోక పయిగా మెండైన కొండెంబుతోఁ
జీలంగుట్టి విశేషబాధలకు లోఁ జేయంగ నెప్పెంచు నా
తేలుంబోలెఁ జరింపఁ జూచెదవు నీదేహం బనాపాయమే
కాలుం డింతయుఁ జూచి నిన్ను మనసా కాటించి దండింపఁడే?

మ. ఫలముంగోరక కర్మసేయు ఘనుఁడే భక్తుండు; భక్తాళి వ్యా
కులము ల్మాన్పి శివుండు హర్షమునఁ జేకూర్చు న్మహాసౌఖ్యముల్
ఫల మాసించినవాఁడు పొందు ఫలమే భ్రాంతిం దగ న్వీడి యే
ఫలముం గోరక కర్మసేసి, మనసా భర్గున్ బ్రశంసింపవే. 23

మ. ధరలో మానవజన్మ మెత్తి హరుపాదంబుల్ విసర్జించి వై
తరణిం గూలెదవే నిరర్థకముగా దా రేమియుం లేదె యీ
శ్వరునిన్ భక్తి భజించినం దొలఁగవే పాపౌఘము ల్వెంటనే
దొరకం జాలదె నీకు ముక్తి మనసా దూరంబు చింతింపవే.

మ. తనసౌందర్యము భాగ్యమున్వయసు సంతానంబు ప్రాగల్భ్యముం
దినము ల్బోవుచు నున్నకొద్ది దినవృద్ధిం బొందునంచెంచి కా
నన మధ్యస్థ మృగంబుచందమున నజ్ఞానంబునన్ శంభునిం
గన యత్నంబులు సల్పకున్న మనసా కాలుండు దండింపఁడే?

మ. తరుణిం జూచిన యంతనే మదముచేతం దాని మో మాళశిం
బురు డించుం, బిగి గబ్బిగుబ్బయను బొల్పుల్మీలు బంగారపుం
బరణుల్, మోవియు దొండపం డనుచు నాఘాలాషు సేవింప నే
పరమార్థంబును లే దటంచు మనసా పాపంబు లార్జింపకే. 26

మ. అతియోగ్యం బగుజన్మ మిచ్చినను నత్యంతాదరాయత్తుఁడై
సుతుచందంబునఁ బెంచునట్టి విభు నాక్షోణీరథు న్వీడి నీ
పతిసీచత్వముఁ బూని వాని నెపుడున్ ధ్యానింప కున్నావు దు
ర్గతినిం బొందుదువే సు నీవు మనసా ప్రార్థింపవే భర్గునిన్. 27

మ. తనబాగే మదిఁ గోరి దేశమునకుం దైన్యంబు గల్పించు నా
జనునిం బట్టి యమాలయంబునకు విస్పష్టంబుగాఁ గింకరుల్
గొని దండింతురు చిక్కుపెట్టుదురు కాళ్లం గట్టిగాఁగట్టి పీ
డనముం జేతురు గాన వెట్టిమనసా టాటోటులన్ మానవే. 28

మ. తననామంబును సంస్మరించి తనపాదంబుల్ మహాభక్తితో
వినుతిం జేయుచు ముక్తినొందె దనుచున్ విశ్వేశ్వరుండిచ్చెఁ బా
వనమౌ మానవజన్మ మెంతయు దయన్ వ్యర్థంబుగా దానిఁ బా
డొనరింపం దగునంటె వెఱ్ఱిమనసా యుక్తంబు చింతింపవే. 29

శా. ఆశాపాశముచేతఁ గట్టఁబడి వ్యర్థాయాసముం బొందుచున్
నాశం బొందెడి లోకసౌఖ్యములకై నానాప్రకారంబులన్
ఆశంజేయుదుగాని శంభుపదముల్ ధ్యానింప వేవేళ నిన్
గాశీవాసుఁడు మెచ్చునంటె మనసా కైవల్యముం బొందుదే?

మ. అనుమానించెదవేల శంభుని మదిన్ ధ్యానింపవేలా నినుం
గనిపట్టున్ వగఁ దీర్చికాచు దయతోఁ గష్టంబులం బాపుఁ జూ
పును గారుణ్యము నిచ్చుఁ గోరుకులు శంభూ!యన్నమాత్రాన స
జ్జనలోలుం డతనిన్ భజించి మనసా సాయుజ్యముం బొందవే.

శా. ఆసంజేసి ధనార్జనం బధిక ముఖ్యంబంచు లో నెంచుచున్
దోసం బీపనియంచు నెంచక కడున్ దుర్మార్గతన్ సాధులన్
మోసం బొప్పఁ దతిర్థముల్ గొనుదువే ముందేమి రానున్నదో
వీ సంబైనను నెంచవేల మనసా వేధించు నిన్ గాలుఁడున్.31

శా. నేఁడో రేపొ మ ఱెన్నఁడో గడియకో నెల్లాళ్లకో యేఁటికో
వీడుం జీవుఁడు దేహ మెట్లొ; యది తప్పింపంగ రా దేరికిన్
బాదైపోకుము నిత్య మాశివుని సంభావించి కైలాసముం
జూడం గోరుము; చూడ నిచ్చు;మనసా క్షోణీరథుం గొల్చినన్.

శా. నామీఁదే దయ గల్గనేని వినుమా నాతప్పులన్ సైచి నీ
నామంబే స్మరియించి నిత్యమును నానందించున ట్లొప్పుగా
స్వామీ! చేయఁగరాదె నీకు దయలేదా? యంచు నీలోననే
వేమారున్ గడు భక్తితోడ మనసా విశ్వేశ్వరుం గొల్వవే.34

శా. సంతోషించెద చిత్తశాంతి దయతో స్వామీ! దయం జేయవే
యంతేచాలును దానికన్న నధికం బర్థింప నిక్కంబు, ని
శ్చింతం బ్నీదుపదంబులం దలఁచుచున్ సేవింపుచున్ ముక్తి నా
యంతంబందునఁ గాంతునంచు మనసా యర్థింపవే శంభునిన్.

మ. పరవిత్తంబులపై విరక్తియును దత్నాదాజ్ఞ సద్భక్తియున్
స్థిరమౌ ముక్తియు దీనులం దధికరక్తిన్ దేశసంసక్తియున్
పరభామ న్మది( బార్వతీరమణిగా భావించు నాసక్తియుం
గరుణన్నీకిడ( గోరుకొమ్ము మనసా గౌరీపతి న్నిత్యమున్.36

శా. నా కేమైన నొసంగు మంచు నిను నే నా(డైన నర్థించి, చీ
కాకుం బుచ్చితినో, సభక్తిక నమస్కారంబు( గావింపనో,
నీకున్ భక్తు(డ(గానొ, తప్పిదము లెన్నే(జేసి యున్నా(డనో,
సా(కుల్ పన్నక కావుమంచు మనసా శర్వున్ సదా వే(డవే.

మ.ముదిమిం జిక్కితి దంతము ల్వీడలె మోము న్వాడె నంగంబులున్
గదలం జాగెను దృష్టితప్పె( జెవు లాకర్ణించుట న్మానె నా
మదికిం స్థైర్యము గోల్పడెన్;విడదు సొంటా!తృష్ణ నన్నొక్క(డే
వదలం జేయుము దాని నంచు మనసా ప్రార్థింపవే భర్గునిన్.

శా. ఆయుర్దాయము చాల(గా( గలదు, నే యామ్యాలయం బప్పుడే
డాయం బో నని యెంచుచుండ,జర, గంటం గొట్టి పైకెక్కెనన్
మాయం బన్నిసమస్తకాయములకున్మాంద్యంబు చేకూర్చెనో
శ్రేయోదాయక గావుమంచు మనసా శ్రీకంఠునిం గొల్వవే. 39

మ. దినముల్ వ్యర్థముగా గతించె(గద నీదివ్యాంఘ్రము లొకప్పుడున్
చనివిం దీర(గ( గొల్వనైతి(గద, నిన్ ధ్యానించి పూజింపనై
తిని; నే మందును నాచరిత్ర; వినుమో దీనావనా! నాకు సా
ధనముం జూపు మటంచు శంభు మనసా దైవాళి( బ్రార్థింపవే.

శా. నా కాచక్కఁదనంబు జవ్వనము నానాభోగముల్ సంపదల్
లోకేశా ! కడు శాశ్వతంబు లని యాలోచించి గర్వంబునన్
నీకారుణ్యముఁ గోరనైతి జడుఁడన్ దీవించి నన్నేలుమీ
నీకే మ్రొక్కెద నంచు నీశు మనసా నిత్యంబుఁ బ్రార్థింపవే.

మ. తలపోయంగనె శంకరుండు నిజచింతం బాపి రక్షించు నీ
తలఁపుల్ దీర్చు సుఖంబుగూర్చు నధికద్రవ్యంబునుం జేర్చు ని
చ్చలు నిన్ గాచు వరంబులిచ్చు నిలుపుంజ్ఞానంబొసంగున్ దయా
నిలయుం డాతఁడు వానిఁగోరి మనసా నిత్యంబు సేవింపవే.

శా. నాలోపంబుల నెంచి నన్ను వినకున్నన్నన్నుఁ గాపాడువాఁ
డీలోకంబున లేఁడు, నీపదములే నెల్లప్పుడుం గొల్చెదన్
బాలన్ ముంచెదొ నీట ముంచెదవొ నాధారంబు నీదే సుమా
వాలాయంబుగఁ గావుమంచు మనసా ఫాలాక్షునిం గొల్వవే.

మ. బహుజన్మంబులనుండి చేసిన మహాపాపంబు కాఁబోలు న
న్నిహమం దెన్నియొలేనిపోనికలతల్ హేయంపురోగంబులున్
అహహా ! కల్గఁజేసి నిన్ను మదిలో ధ్యానింప నీకుండు నో
యహిభూషా! దయఁగావుమంచు మనసా యర్థింపవే శంభునిన్

శా. ఎన్నేనిం దినముల్ నిరర్థకముగా హీనుండనై పొత్తిగా
నిన్నుం గొల్వక వెళ్లఁబుచ్చితినయో నీ కన్న నన్ బ్రోచు వా
రెన్నంధాత్రిని లేరు శంకర ! హరా! హేనాథ! హేదేవ! యా
పన్నుండన్ దయఁగావుమంచు మనసా భర్గుం బ్రశంసింపవే.

శా. కాలుం డెంతయు నిర్దయుం డతఁడు దుష్కార్యంబులం జేయు దు
శ్శీలుం జూచి మహోగ్రుఁడై కఠినుఁడై శిక్షించి యెంతేనియుం
దూలించుం బొడిపించు వైతరణిలోఁ ద్రోయించుఁ గాల్పించు నీ
వాలస్యం బిఁక సేయఁబోక మనసా యాభర్గునిం గొల్వవే.46

మ. కరుణామూర్తివి, భక్తలోలుఁడవు సంకల్పార్థదుం డీవు నీ
చరణాబ్జంబులు నమ్మి కొల్చినను నాజన్మాంతరం బందునే
సరవింజేసిన పాపకృత్యములు నన్ సాధించుచుండెన్ దయా
కర ! బాధం బడఁజాలనంచు మనసా గౌరీపతిం గొల్వవే. 47

మ. తొలుత న్నోమునఁ బద్మజుం డిడినపంక్తుల్ తప్పఁగా శక్యమే?
తలపం గర్మఫలంబు జీవునకుఁ దథ్యంబంచు నీవెంచినన్
గలతం బొందెడి వేళఁజూడక విడంగా శంకరా ! నిన్నునేఁ
గొలువన్నిష్ఫలమంచు వెట్టిమనసా కూటేశ్వరున్ వీడకే. 48

శా. కాపాఁడంగలవాఁడవే యయిన నన్ గావంగ లేకుంటివే
నేపాపంబుల నేర జెప్పు మెటులే నేరీతిఁ గైకొంటినో
నాపాపంబులు నీకు నష్టపడి యుండం బోలు లేకున్నచోఁ
బ్రాపై కాచియె తీరుదంచు మనసా భర్గున్ బ్రశంసింపవే. 49

మ. జలజాతంబులు నీట మున్గి కనెనే స్వారాజ్యసంపత్తి ? పా
ములు వాయుం గొనినంతమాత్రముననే మోక్షంబునం జేరునే?
లలి యాచిల్కలుపండ్లు గోరి తిని కైలాసంబునుం జేరెనే ?
తలఁపన్ శంభుని వేఁడకున్న మనసా దాక్ష్యంబు సిద్ధించునే ?

మ. కరుణాశాలి శివుండు వానికి నమస్కారంబు లర్పింప నీ
దురితంబుల్ దొలఁగించి నిన్ను నెపుడున్ దుఃఖంబులం జేర నీ
కురుకారుణ్యముచేత ముక్తి నొసఁగున్ యుక్తంబుగా వానినిన్
నిరతంబున్ భజియించి నీవు మనసా నిర్వాణముం బొందవే.

శా. ప్రేమం బెంపఁగఁ గోర్కె లీయఁగ ధరిత్రిన్ వర్థిలంజేసి సు
క్షేమం బీయఁగ ముక్తి నీయఁగఁ గడుం గీర్తిం బ్రసాదింప స
త్సామర్థ్యం బగు నీదు నామమును నే సంపూర్ణ సద్భక్తితో
నామోదంబున నెంతునంచు మనసా యర్థింపవే భర్గునిన్. 52

మ. ఇది కోరందగు దీనిఁగూడ దని నాకింతైన జ్ఞానంబు లే
దదిగానన్ జనకుండువోలె జనహా యావశ్యకంబున్ దయన్
ఇదిగోఁ గైకొను మంచు నీయవలదా యీమాయలేలా దయా
హృదయా! వేగమె కావు మంచు మనసా యీశాను నర్థింపవే.

శా. నాపాపంబులు రోగరూపమున నానారీతులంబట్టి సం
తాపంబు ల్గలిగించి బాధపఱుపం ధ్యానించుటన్ మాని నీ
కోపంబే తగుకారణం బనుచు నిన్ గూఢుండనై యున్న నా
పాపంబుల్ క్షమియించుమంచు మనసా ప్రార్థింపవే శంభునిన్.

శా. ఏ నీధాత్రిని బొందు బాధలకు నీవే కారణం బంచు నే
జ్ఞానం బించుకయైన లేమి నకటా! సత్కర్మముల్ మాని నీ
ధ్యానంబే విడనాడి నాతనువు నిత్యంబంచుఁ జింతించితిన్
మన్నింపంగదె నేరమంచు మనసా మాహేశ్వరుం గొల్వవే.

మ. మొదట న్నీవొనరించు కృత్యములు నేమూఢత్వముం జేసి నా
కదయత్వంబున నిట్లు చేసి తని. ని న్నంటిన్ మహాదేవ ! నె
మ్మదియోజింపఁగమేలెయయ్యెసుమి!నన్ మన్నింపుమోశంకరా!
సదయా ! దీనుఁడనంచుమ్రొక్కి మనసాశంభున్సదాగొల్వవే.

మ. నిను నెల్లప్పుడుఁ బూర్ణభక్తిఁ దగ ధ్యానింపంగఁ బ్రేరేచుచున్
నను నీభక్తునిఁ జేసి మోక్ష మిడఁగా నన్నొంటరిం జేసి నా
కనువౌ రోగముఁ గూర్చినాఁడవుగదా యార్యా!మహాదేవ! నా
జనియున్ సార్థక మయ్యెనంచు మనసా శంభున్ బ్రశంసింపవే.

శా. నా కేదేది యొసంగఁగాఁ దగునొ యే దేదీయఁగాఁగూడదో
నీకే చక్కఁగఁ బూర్తిగాఁ దెలియుటన్నేనేమియుం గోరఁగా
నా కాయక్కఱ లన్నిఁ దీర్చి కరుణన్ న న్నేలుమో శంకరా !
శ్రీకంఠా ! యని శంభు నీవు మనసా సేవింపుమా నిత్యమున్.

మ. నను నెవ్వారు నుతించినన్ దెగడినన్ నానార్థముల్ గల్గినన్
మనమం దెప్పుడు నీదు నామమును సంభావించి యాభాగ్యముల్
క్షణమాత్రంబు లటంచు నెంచి విడుతు న్గాంక్షించ, నవ్వాని నే
నిను సేవించెద నంచు గోరి మనసా నిత్యున్ హరున్ గొల్వవే.

మ. శమనుం డెప్పుడు నన్నుఁబట్టికొని పాశంబుం బ్రయోగించునో
శ్రమయెంతేనియుఁ బొందుచుండి నిను నేస్వామీ!యనంజాలనో
తమకం బించుక చూపి నీపదములన్ ధ్యానింప ని న్నిప్పుడే
యమలాంతఃకరణా ! యటంచు మనసా యర్థింపవే భర్గునిన్.

మ. చలి నీరిం మునుగ న్భయంబు మడివస్త్రం బన్నఁజీకాకు యా
త్రలు సేవింపఁగ శక్తిలేదు; తగధర్మంబుం బొనర్పంగ నా
వలనం గాదు; నినున్ భజించెదను దేవా శంకరా! శంభు! నం
జులుకం జేయకు మంచు నీవు మనసా క్షోణీరథుం గొల్వవే.

మ. మృతియే లే దదియుండినం దనకు రానేరాదు సంసారమే
క్షితిలో శాశ్వతమైన దంచు సదయున్ శ్రీకంఠునిం గొల్చుటే
మతిలో వ్యర్థమటంచు నెంచెదవు సుమ్మా! పాడుగాకుండుమా
గతి యాతండె సుమా! నిజంబు మనసా గంగాధిపుం గొల్వవే.

శా. సాష్టాంగంబుగ దండముల్ సలుపుమన్ సంసారబంధబులన్
స్పష్టంబౌ దయచేత వీడఁబడి నీపాదాబ్జముల్ భక్తిమై
నిష్టం బెంతయుఁ గల్గి పూజ సలుప న్నిచ్చించు సద్బుద్ధి నే
కష్టంబైనను నీయు మంచు మనసా గౌరీపతిం గొల్వవే. 63

శా. జాలిం జూపి సమస్తపాపములు నాశమ్మున్ దగం జేసి ని
న్నాలున్ బిడ్డలు స్నేహితుల్ హితులునాప్యాయంబునంజేసియా
కాలుం దప్పుడు వెట్టుబాధలను బోకార్చంగ వారెంతురే ?
మేలుం జేయును శంకరుండు మనసా మేలెంచి ప్రార్థింపవే.

మ. గతి నీవంచు భజింతు; నన్ను నపవర్గంబందున న్మించి దు
ర్గతినింబొందకయుండఁ జేయుము,నమస్కారంబులం జేయుదున్
క్షితికంఠా ! జగదీశ్వరా! సదయ! లోకేశా యటం చెప్పుడున్
స్తుతులం జేసిన మోక్ష మిచ్చు మనసా క్షోణీరథుం గొల్వవే.

శా. బెల్లంబందున బొట్ట లున్న, నవి తీపిం జంపునే? యెంచఁగన్
అల్లంబందున వంకరల్ చెఱుపునే యద్దాని సౌరభ్యమున్
ఉల్లంబందున భక్తి గల్గిన నదే యొప్పారఁగాఁజేయు, నీ
కల్లల్ బొల్లులు మాని నీవు మనసా గౌరీపతిన్ గొల్వవే. 66

మ. జననం బొందిన నాటఁగోలె నిను నజ్ఞానంబునం జేసి నే
వినుతిం జేయక పూర్తిగా మఱచితిన్ విశ్వేశ ! నాలోపముల్
మనమం దెన్నక యేలుకొమ్ము శివ! సాంబా! యన్ననావెంటనే
నిను రక్షించును వానిఁ గోరి మనసా నిత్యంబు సేవింపుమా.

మ. నిను సద్భక్తిని మెచ్చు నట్లొనరఁగా నేఁజేయఁగా నెంతవాఁ
డను;బాపాత్ముఁడ; దోషచిత్తుఁడను;జండాలుండకుంఠుండ,నిన్
మునులే గానఁగలేకపోయి రన నేఁ బూజించి మెప్పింతునే;
యను చాశంకరు వేఁడికొమ్ము మనసా యత్యంతసంప్రీతితోన్.

మ. భజనం జేయుచు నుండుఁగాని నిజమౌ భక్తుండు కాఁడంచు నా
నిజముం గోరి పరీక్షసేయు నెడ నే నిల్వంగలేనో శివా !
విజయం బొందఁగ నట్టినత్త్వమెది ? నే భీరుండ, నీభక్తుఁడన్
రజతాద్రీశ్వర ! కావుమంచు మనసా రాజాంకునిం గొల్వవే !

మ. నను రక్షించెడి భార మంతయును నన్నా నీదె సుమ్మీ యిఁకన్
నిను ధ్యానింప నశక్తుఁడన్ మునిఁగి నే నిత్యంబు సంసారమన్
ఘనసంద్రంబున నుటంచే; నెటుల నన్ బెంపొందఁ బాలించెదో
యనుచుం భర్గుని వేఁడికొమ్ము మనసా యశ్రాంతమున్ భక్తిమై

శా. పాపాత్ముం దరిఁ జేర నిచ్చిన మహాపాపం బటంచున్ ననున్
గాపాడంగను రాక మానితివొ నీకాపత్యమో లేక నా
పాపంబుల్ నిను నడ్డగించెనొకొ విశ్వాధార ! లోకాశ్రయా !
యాపద్బాంధవ ! కావుమంచు మనసా యాచింపవే శంభునిన్.

శా. పాపాత్ముం డితఁ డంచు వీడకను నాపాపంబులం బాపవే
నీపాదంబులె నాకు రక్షకములౌ నీనామమే దిక్కునే
నాపాపంబులకంటె నేమి యిడుదున్ వానిం దయం గొమ్ము నా
లోపంబుల్ క్షమియింపుమంచు మనసా లోఁబర్చుమా భర్గునిన్.

శా. ఏతం డాశ్రితవర్గకల్పతరువై యెవ్వేళ సత్యంబునే
ప్రీతిం బల్కుచు నార్యులందు సముఁడై స్త్రీలందు సద్భావుఁడై
ఖ్యాతుండై హర పాదభక్తిపరుఁడై యాశంభుఁ బూజించు న
ల్లాతండే సుమి మోక్ష మొందు మనసా యత్యంతసద్భక్తుఁడై.

మ. పరులం దప్పులు పట్టకుండుటయు సద్భావంబుతో నెప్పుడే
తరుణి న్గాంచి మనోవికారమును బొందం బోక సద్భక్తితో
హరు సేవింపుచుఁ బేదవారలకు నత్యంతాశ్రితుండైన యా
నరుఁడే భక్తుఁడు వానిఁగాంచి మనసా నందించు శంభుండెదన్

మ. హరునామంబు మదిన్ స్మరింపుచును సత్యంబే సదా పల్కుచున్
హరుఁబూజింపుచుఁదల్లిదండ్రులసునిత్యంబుందయంజూచుచున్
హరు సేవింపుచు దేశసేవ తనదార్ఢ్యం బట్లుగాఁ జేయు నా
నరుఁడే భక్తుఁడు వానిఁగాంచి మనసా నందించు శంభుండెదన్

మ. హారునిం జేరఁగఁ గోరుదేని మదియందైనం బరద్రవ్యముల్
పరభామారతి పెద్దలం దదయ దైవంబందు పైమత్యమున్
ధర సంబంధులమీఁద నప్రియము సంసారంబుపై నిష్టముం
బరివర్జించితివేని నీకు మనసా భర్గుండు ప్రత్యక్షమౌ. 76

శా. తన్నుం బాయని భక్తిఁ గొల్చి బుధబృందంబందు సౌజన్యమా
పన్నత్వంబున నున్నవారియెడలన్ వాత్సల్యభావంబు మా
కన్నంబో యనుచున్న పేదలకు నాహారంబుఁ బెట్టించువాఁ
డెన్నంగాఁ దనభక్తుఁడంచు మనసా యిష్టించు శంభుండెదన్

మ.మనుజుల్మెచ్చువిధంబున న్నడుచుసమ్మాన్యుండె పుణ్యుండగున్
మనమందేనియు మచ్చరంబు పరభామాసంగతిన్ లేక యా
ననమం దొప్పగునవ్వు; పేదలయెడం దాత్పర్యముం గల్గు నా
జనుఁ డేపుణ్యుఁడు వానిఁగొల్వ మనసా శంభుండుసంతుష్టుఁడౌ

కా. శ్రీరామాది మహానుభావులును నాశ్రీకృష్ణుఁడున్ మౌనులున్
ధారాళం బగు దేశభక్తిగలరై తాత్పర్యముం గల్గి దా
రారాధింపుచు దేశవాసులకు సౌఖ్యం బెంతయుం గూర్చుచుం
జేరంజాలిరి ముక్తి నీవు మనసా సేవింపవే దేశమున్. 79

మ. ధనసంపాదన లేనివాఁడు పడు సంతానంబుచే బాధలన్
ధనముం గల్గినవాఁడు పొందుఁ గడుసంతాపంబు నిత్యంబునున్
దనకుం బుత్త్రులు లేకపోయి రని, చిత్రంబుల్ భవల్లీల ! లే
మన నేనేర్తును ? గావు మంచు మనసా యర్థింపవే భర్గునిన్.

మ.ధనికద్వారములందు నిల్చి యయినన్ ద్రవ్యంబు చేకూర్చి యా
ధనమున్ శంభున కర్పితం బనుచుఁ దా ధర్మంబులం జేయు చే
జను నైనం దనసాటివాఁ డని మదిన్ సందేహమున్ వీడి వా
నినిఁ బూజించిన భర్గుఁ డిచ్చు మనసా నిండారు సౌభాగ్యముల్.

మ. ధనసంపాదనఁజేయుచున్ శివుని నిత్యంబున్ మది న్గొల్చుచుం
దనద్రవ్యంబును దేశలాభమునకై ధైర్యంబుగా స్వేచ్ఛగా
వినియోగింపుచు సత్యవాక్ప్రియుఁడునై విశ్వాసపాత్రుండు నై
చను నాపుణ్యుని గాంచి మెచ్చు మనసా శంభుండు సంతుష్టుఁడై

మ. ధనమూలంబునఁ బుణ్యకార్యములు నిత్యం బొప్పుగాఁ జేసి స
జ్జనులన్ సౌఖ్యమునందు నిల్పి శివునిన్ సద్భక్తితో నెప్పుడున్
వినుతిం జేయుచుఁ బేదలం దనుపుచున్ విఖ్యాతిఁ బొందందగున్
అనుకూలంబుగ శంభుఁ గొల్చి మనసా యార్జింపవే విత్తమున్

మ.ధనముం గల్గిన యోగ్యుఁ డెల్లరకు సద్ధర్మంబులం జేయుఁ;దాఁ
దిని సౌఖ్యంబుఁ గడించుఁ;దోడిజనులందృప్తాత్ములంజేయుఁ;గా
పున మాన్యుండు ధనంబుఁ గూర్చవలె;శంభు న్నీవు సద్భక్తితో
ననయంబుంగొలుపంగనిచ్చుమనసాయీభాగ్యమున్భోగ్యముల్

మ. ధనమార్గంబున సర్వలోకముల, సంతానంబునుం గాక దే
వుని నైనం గడుఁదృప్తిఁజేసి సుఖముం బొందంగనౌ నింకనున్
గొనఁగావచ్చును బుణ్యలోకములు; నీకుం గోరఁగా ద్రవ్య మి
చ్చును గాదే? కడు వేగ నీవు మనసా క్షోణీరథుం గొల్వవే.

మ. ధనవంతుం డిల ధర్మకార్యములు సందర్భంబుగాఁ జేయు స
జ్జనబృందంబున కెంతయేని సుఖమున్ సాధించి సౌఖ్యంబుఁ దా
నును బొందంగను;శంకరు న్నియతుఁడై నోరారఁగీర్తించుఁ గా
వున నీశాను భజించి పొందు మనసా భోగ్యంబు లవ్వారిగాన్.

మ. బహుమాన్యుండవు నీవు నే నధికపాపాత్ముండనే యౌట న
న్నహితుంగాఁ గొని కావకున్న నిఁక నే నాధారశూన్యుండ నన్
విహితుంగాఁ గొని యేలు శంకర! హరా! వేవేగమే యంచు నీ
వహిభూషు న్నిరతంబుఁ గొల్చి మనసా యర్థింపవే ముక్తినిన్.

శా. అన్నాఁ డెవ్వనినో యొకానొకని నాప్యాయంబుగా నేలి నా
విన్నాఁ డెవ్వనినో మఱొక్కరుని నీ వేమో దయం గాచినా
వన్నా రంతియె కాని నే నెఱుఁగ న న్నాపన్నునింగావ రా
కున్నా వేమి యటంచు నీవు మనసా యుగ్రాక్షునిం గొల్వవే.88

శా. డంకాకొట్టి వచించెదన్ శివుని వేడంగానె-పాపౌఘముల్
బింకంబెల్లను వీడి పాఱితొలఁగున్ భీతిల్లి; కాలుండునున్
శంకించు న్నినుడాయ జంకు, సుమ, నిస్సందేహ మీమాట నీ
శంకల్మాని హరుం దలంచి మనసా సాయుజ్యముం బొందవే.

మ. శివునిం దప్పక కాంచి దివ్యపదముల్ సేవింప నీ వెంచుచో
నవలీలం దరిసింపవచ్చుఁ బూమి యత్యాంతాస్థమై దేశమున్
భువియందున్న జనంబు లెల్లరును సమ్మోదింతు రెల్లప్పుడున్
సవిధేయత్వముగా భజింప మనసా సందేహముం బొందకే. 90

మ. తిరిపెం బెత్తెడి శంకరుండు జగతీదేవుండె ? నీపాపముల్
దరుమం జాలునె? వెఱ్ఱి వెఱ్ఱి యనుచుం దాడించుచున్నారయో!
కరుణన్వేగమె కానిపించుకొని నన్ గాపాడ సామర్థ్యమున్
స్థిరముం జేయుమటంచు నీవు మనసా శ్రీశంకరుం గొల్వవే.

మ. హరిపద్మాసనముఖ్యదేవజనపూజార్హుండు దేవుండు శం
కరుఁ డాద్యుండు పరుండు భక్తజనసంకల్పార్థదుం డార్యుఁ డా
హరుపాదంబులు ముక్తిదంబులుసుమా హర్షించి పూజింపుమా
తిరిపెం బెత్తు నటంచు వాని మనసా ధిక్కారముం జేయకే. 92

మ. కృపతో బ్రహ్మ సమస్తలోకములు దా సృష్టించుచుండెం గదా
నెపముం బెట్టక విష్ణుమూర్తి జగముల్ నేర్పొప్పఁ బెంచుంగదా
త్రిపురంబుల్ దునుమాడి దేవతల నా శ్రీకంఠుఁ డేలుం గదా
యపకారంబులు చేసి పాడుమనసా యాక్షేపముల్ పొందకే.

మ. హరియున్ శంభుఁడు నీరజాసనుఁడు వీ రాకారమం దన్యులై
గుఱుతింపంబడుచున్నవారె లయినన్ గూటస్థులై యొక్కరై
పరగుం గావున భేదబుద్ధి విడి సద్భావంబుతో నిచ్చలుం
గరుణం గావు మటంచు భక్తి మనసా గౌరీపతిం గొల్వవే. 94

మ. తమలాభంబుఁ ద్యజించి దేశమునకై ద్రవ్యంబు సౌధంబులున్
దమ సర్వస్వము దేహముం దుదకుఁ బ్రాణాలన్ విసర్జించి స
త్యము పాటించి యపారకష్టములనే హర్షమ్ముతోఁ బొందు ను
త్తములే భక్తులు, వారిఁ గొల్వ మనసా తాపాలు చల్లారవే ?

మ. కలుగం జేయుము నీపదాబ్జములపై గాటంపుసద్భక్తి నా
చలచిత్తంబున; నంతమాత్రమునకే సంతోషముం బొంది నిన్
దలఁతున్నిత్యము; ముక్తిఁ బొందెద ననంతా! దేవదేవా!దయా
నిలయా! యంచు హరున్స్మరించిమనసానిర్వాణముం బొందవే

మ. మును నీలోఁగల సర్వదుర్గుణములన్ మూలంబుతోఁద్రెంచిశం
భుని పాదాబ్జములన్ భజింపఁగలుగున్ మోక్షంబు సిద్ధంబుగా
వినలేదే ? ఘను లెందఱో యటులనే వీక్షించి యాశంభునిన్
గని కైలాసముఁ బొందినారు మనసా గౌరీపతిం గొల్వవే. 97

శా. నీకర్మంబున కీవె కర్తవుసుమా ! నే నేమియుం జేయ,నం
టే కష్టంబులు వాపువాఁడవ ని పాటింజేసి ని న్వేఁడితిన్
నా కీమాత్రము చేయలే ననిన నే వ్రముండనై వేఁడఁగా
నాకున్ దీరికలేదు నాక మనసా నాటంగఁ బ్రార్థింపవే. 98

మ. పరునిన్ సోదరుఁ గాఁ దలంచుటయు న న్బాటించి యెవ్వారలే
పరుషంబు ల్వాలుకంగ వారలకు నేఁ బ్రత్యుత్తరం బీయకే
గురుభక్తిన్నిరతంబు నీదు పదముల్ గోర్కిన్ భజింపంగ సు
స్థిరబుద్ధిన్ దయనేయు మంచు మనసా శ్రీకంఠునిం గొల్వవే.

శా. ఎంతల్ వేఁడుదు నెంత వేఁడినను నీ కేమో పరా కయ్యె గో
రంబైనన్ దయఁజూపవైతి, విది యన్యాయంబు కాదే ఘో! శ్రీ
కాంతావల్లభపూజితాంఘ్రియుగళా ! గౌరీపతీ ! శంకరా !
పంతం బేలర కావుమంచు మనసా ఫాలాక్షునిం గొల్వవే. 100

మ. తనలాభంబునకై సదా పరుల నిర్దాక్షిణ్యభావంబుతో
గనుచున్ వారిని బాధపుచ్చి ధనమున్ గైకొంచు బాధింపుచున్
దినముల్ వ్యర్థము పుచ్చుచుంటివిసుమీ దీక్షించి యాకింకరుల్
పెనుబాధ ల్గలిగింత్రుకాన మనసా విశ్వేశ్వరుం గొల్వవే. 101

మ. శిరము న్వంచి కరద్వయంబు నుదుటం జెన్నారఁగాఁ జేర్చి నీ
చరణాబ్జంబులకున్ సభక్తిక నమస్కారంబు లర్పింతు నన్
గరుణం గావవె ధాత్రిలో నిఁకను నీకన్నన్ దయాశాలి నా
కొరు లెవ్వారును లే రటంచు మనసా యుగ్రాక్షు సేవింపవే.

శా. కారుణ్యాలయుఁ డంచుఁ జెప్పఁగ నమస్కారంబులం జేసి నే
రారా, కావర, నేరముల్ సయిచరా, రక్షింపరా, శ్రీకరా
కారుణ్యం బొక యింతచూపర, యనంగా రావదేలా ప్రభూ
నేరంబుల్ సయిరింపు మంచు మనసా నిత్యున్ హరు న్గొల్వవే,

మ. కవితం జెప్పఁ దెలియంగఁ గావ్యముల నొక్కండైననుంజూడ శా
స్త్రవిచారంబు లెఱుంగ లక్షణము నేర్వం జాలకున్నాఁడ నే
నవశత్వంబున దీని వ్రాసితిని నీయాప్యాయముం గోరి కై
కొను దీనిన్ దయచేసి యంచు మనసా కూటేశ్వరుం గొల్వవే

మ.తనయుం డాడినతొక్కుఁబల్కులకు నత్యంతాప్తుఁడై లోలుఁడై
జనకుం డెట్టుల సంతసించునొ, యదేచందంబుగాఁ దండ్రిః నీ
వును నన్నున్దయఁజూచి యీశతకముం బొల్పొందఁగాఁజేయవే
యని యీశంభుని వేఁడికొమ్ము మనసా యత్యంతసద్భక్తితోన్

మ. స్థిరభక్తిన్ రచియించి నీకు నిట నుద్దేశించి యీపొత్తమీ
శ్వర సంవత్సర మాఘశుద్ధవిదియం బ్రారంభముంజేసి నీ
కరుణన్ ఫాల్గుణశుద్ధమందు దశమిం గైకొన్కగా నిచ్చితిన్
శరణంబీయు మటంచుఁ గోరి మనసా శంభున్ సదా వేఁడుమా

శా. గారాబంబున నీకుఁ జక్కనగు కైకొన్కన్ సమర్పింపఁగా
సారస్యం బగుపద్యముల్ శతముగా శార్దూల మత్తేభముల్
భారద్వాజమునీంద్రగోత్రజుఁడు సుబ్బారాయఁ డిచ్చె న్మహా
కారుణ్యాలయ గొమ్మటంచు మనసా గౌరీపతిం గొల్వవే.

మ. సురరాజ్యాధిప! రాజశేఖర! మహాశోభాయమానా ! మహే
శ్వర!శంభూ!జయమంగళం జయ మహామంగళమ్ మంగళమ్
కరుణాసాగర! పార్వతీహృదయ! గంగాలోల శ్రీమంగళమ్
సరవిన్ హారతు లిత్తు నంచు మనసా శంభున్ సదా గొల్వవే

మ. తనరన్ నిత్యము భక్తియుక్తి పొలుపొందన్మానసోద్బోధనం
బును దీనిం బఠియించువారలకు శంభుం డిచ్చు నిండారఁగా
ధనధాన్యంబులు మాన్యముల్ తగిన సంతానంబు సద్బుద్ధియుఁ
దనకైలాసముఁ గాన నీవు మనసా తద్గ్రంథమున్ వీడకే. 109

సంపూర్ణము.

శ్రీమదుమారమణ పాదార్పిత మస్తు.

